శ్రీమతే నారాయణాయ నమః

## శ్రీపాఞ్చరాత్రాగమాన్తర్గత మన్త్ర సిద్ధాన్తానుసారి

# భగవదారాధనా విధిః





పంచమ ముద్రణము

ఆగష్టు 2010

# భగవదారాధనా విధిః



ప్రతులకు


| జీయర్ ఎడ్యుకేషనల్ ట్రస్ట్ (TM)<br>వేద విశ్వ విద్యాలయము<br>సీతానగరము - 522 501<br>గుంటూరు జిల్లా, ఆంధ్రప్రదేశ్<br>ఫోన్: (08645) 272929, 272353 | JEEYAR EDUCATIONAL TRUST<br>VEDA VISWA VIDYALAYAM<br>Sitanagaram - 522 501<br>Guntur Dt., A.P.<br>Ph : (08645) 272929, 272353 |
|---|---|
| E-mail : jetsitanagaram@yahoo.com | |
| జీయర్ ఎడ్యుకేషనల్ ట్రస్ట్ (TM)<br>డోర్.నెం. 1-2-412/1/3,<br>గగన్‌మహల్ రోడ్,<br>దోమల్ గూడ, జీయర్ మార్గ్,<br>హైదరాబాద్ - 500 029.<br>ఫోన్: (040) - 23224426 | JEEYAR EDUCATIONAL TRUST<br>D.No. 1-2-412/1/3,<br>Gaganmahal Road,<br>Domalguda, Jeeyar Marg,<br>Hyderabad - 500 029.<br>Ph: (040) - 23224426 |
| శ్రీరామానుజ వాణి (TM)<br>11-49-136,<br>శివాలయంవీధి<br>విజయవాడ -1<br>ఫోన్: 0866 - 2420820 | SRI RAMANUJAVANI<br># 11-49-136,<br>Sivalayam Street,<br>Vijayawada - 1<br>Ph: 0866 - 2420820 |

D.T.P.: పరిశోధనాలయము, ముద్రణ:-శ్రీమాన్ ప్రింటర్స్ & ప్రోసెసర్స్ సీతానగరము.
ఫోన్: (08645) 272929

శ్రీమతే రామానుజాయ నమః

# విషయ సూచిక



# శ్రీవారి మంగళాశాసనములు

'భగవదారాధనా విధిః' అనే ఈ గ్రంథము నాలుగవ ముద్రణకు సిద్ధమవడం ఆనందాన్ని కలిగిస్తోంది. శ్రీపాంచరాత్రాగమంలో, మంత్రసిద్ధాన్తానికి దర్పణముగ కూర్చి అందించిన ఈ గ్రంథము ఇంతవరకు కొన్ని వేలమందికి చేరి ఆరాధన నొక క్రమబద్ధముగా జరుపుకోడానికి మార్గనిర్దేశము చేస్తున్నది.

ఆగమానికి సంబంధించిన పరిచయాన్ని, ఆరాధనలోని వివిధ అంశాలను, శ్రీపాంచరాత్రాగమమునకు సంబంధించిన సిద్ధాన్త వైవిధ్యాన్ని, ఆలయాల్లో ఉండే వివిధ బేరములకు సంబంధించిన వివరణను, వాటి వాటి వినియోగ విధానం, ఆవాహనోద్వాసనాది విశేషాలను సమగ్రముగ కాకపోయినా సంక్షిప్తముగ ఈ గ్రంథం పరిచయం చేస్తోంది.

అనుబంధములుగ కూర్చిన వానిలో మంత్రన్యాసాలు, ఆశ్రమభేదాన్నిబట్టి ఆచరించే మంత్రన్యాసాలెలాఉంటాయనేది పరిచయం చేసిన మొదటి గ్రంథము ఇదేనంటే అతిశయోక్తికాదు. అలానే, శ్రీపాంచరాత్రులంతా ద్వాదశాక్షరీ విద్యావలంబులై న్యాసాదులనన్ని ఆ మంత్రముతోనే చేయడం ఆచారమైపోయింది. 'ఆగమోక్తరీతిలో' ద్వాదశాక్షరవిద్యా దీక్షితులు కావడం అనే పద్ధతి బహుశః, యిప్పుడెక్కడా ఆచారంలో ఉన్నట్లు లేదు. పెద్దలు చేసే విధానం నేర్చి, గమనించి గానీ, అదే రీతిలో తరువాతి తరం వారు ఆచరిస్తూరావడమే జరుగుతున్నట్లు తెలుస్తోంది. అయితే ఆగమప్రోక్త ప్రక్రియలో పంచసంస్కార విధానంగ అష్టాక్షరీమంత్ర దీక్షితులు బహుళంగ ఉన్నందున, ఆరాధన ప్రక్రియలో అష్టాక్షరీ స్వీకరించి వెలువడిన మొదటి గ్రంథముగూడ ఇదే. అష్టోత్తరశతనామ, సహస్రనామార్చన కాగానే విన్నవించే శంగోలం, మన్త్రపుష్పము మొదలైనవి వివరముగ ప్రకాశింపచేసిన మొదటి గ్రంథంగూడా ఇదే. ఇలా ఎంతో విలక్షణమైన, శాస్త్రీయమైన, సంప్రదాయ సిద్ధమైన విషయావిష్కరణతో వెలువడిన ప్రథమ ప్రక్రియా గ్రంథము ఇది.

ఈ నాలుగవ ముద్రణలో వీలయినంత స్పష్టంగా విషయాలను ప్రయోక్తలు గ్రహించాలని, అలా ముద్రించే ప్రయత్నం చేయడం విశేషం. ఆగమ గ్రంథంలో ప్రత్యేకంగా ఉద్ధరించి అందించిన మంత్రాలనన్నింటినీ ఒక పద్ధతిలోనూ, నేరుగ వేదంలోంచే గ్రహించిన మంత్రాలను స్వరబద్ధముగ మరో పద్ధతిలోనూ, అక్కడక్కడా అనుసంధించే ఆగమ ప్రార్థనాదిశ్లోకాలను ఇంకొక పద్ధతిలోనూ, ప్రక్రియ తెలిపే వాక్యములన్నింటికి ఒక పద్ధతిలోనూ అక్షరవిన్యాసాన్ని ఎన్నుకోవడం జరిగింది. దానినీ గ్రంథంలో ప్రయోగించే సాధకులు, ఆచార్యులూ గ్రహించగలరు. దానితోపాటు గతంలో అక్కడక్కడా ఏర్పడ్డ స్ఖాలిత్యములను సవరించుకుంటూ లోపములనూ సరిదిద్దుకోవడమైంది. సుప్రభాతమునకు స్తోత్రపఠనం చేయడానికి ముందు సంప్రదాయసిద్ధంగ అనుసంధించే కొన్ని శ్లోకాదులను చేర్చడం జరిగింది. గ్రంథాన్తమందు నిత్యవిధులలో ఆచరించుకోడానికనుకూలంగ నవకలశస్నపన ప్రక్రియతోపాటు కలశాలను ఆసాదన చేసే స్నపన కోష్ఠమునుగూడ ప్రదర్శించడం గమనించవచ్చు.

నిత్యారాధనలో ప్రామాదికముగానో, ప్రయత్నంతోనో ఏర్పడే అపచారములకు ప్రాయశ్చిత్తములు **శ్రీపాద్మసంహిత చర్యాపాదపు 18వ అధ్యాయములో** ఉన్నాయి. వాటన్నింటిని తాత్పర్యముతో సులభంగ ఆచరించుకొనే రీతిలో త్వరలోనే మన శ్రీపాంచరాత్రాగమ కళాశాల అందించబోతోంది.

యాజ్ఞికులకు సాధకులైన ఆగమపండితులకూ అర్చకబృందానికీగూడ సంతోషాన్ని కలిగిస్తూ అలానే బ్రహ్మోత్సవ ప్రక్రియగూడ ప్రామాణికంగా రూపుదిద్దుకొని త్వరలోనే వెలుగు చూడబోతోంది. ఆగమ సంప్రదాయాన్ని ఆరాధిస్తూ, మన పూర్వులు, ఎన్నో శ్రమలకోర్చి ఆగమగ్రంథాలను ముద్రితములలో, వ్రాత ప్రతులనో తమతమ తిరుమాళికలలో (గృహాలలో) చేర్చిపెట్టుకొని తమ తిరువారాధనలో ఆరాధించుకొంటూ ఉండేవారు. వర్తమాన కాలంలో అంత శ్రద్ధతో వాటిని రక్షించే అవకాశమూ, సమయముగూడ కరువైపోతున్నది. ఏర్పడే బహువ్యాపకత్వం ఒక కారణమైతే, స్థలాభారము మరో కారణం కావచ్చు.

అలాంటి గ్రంథాలు ఎవరివద్దనున్నా వాటిని సంరక్షించేందుకు వీలుగా సంగ్రహించాలని మన శ్రీపాంచరాత్రాగమ కళాశాల కాంక్షిస్తోంది. అలా సేకరించిన వాటిలో తగినవాటిని పూర్వముగాలభించిన అముద్రిత ఆగమగ్రంథాలను ముద్రితాలైన యిపుడు అలభ్యముగా ఉన్న గ్రంథాలను పునర్ముద్రణ చేసే బాధ్యతను కూడా స్వీకరిస్తోంది. అలాంటి గ్రంథాలున్న వివరం తెలియజేసినా, వాటిని స్వీకరించే, వాటిని భద్రంగా లైబ్రరీకి చేరవేసేందుకయ్యే ఖర్చునుగూడ తానే స్వయంగా భరించే బాధ్యతనుగూడ స్వీకరిస్తోంది.

అలాంటివాటిని గురించి తెలిపినవారి నందరి సహకారాన్ని, గ్రంథ రక్షణదృష్ట్యా, హార్దముగ ఆహ్వానిస్తోంది. శ్రీగ్రంథ పునర్ముద్రణకై పూర్తి శ్రద్ధతో, అగమ విద్వాంసులైన **శ్రీ ఉ.వే.శ్రీమాన్ చిలకమర్తి శ్రీనివాసాచార్య స్వామివారు, శ్రీ ఉ.వే.శ్రీమాన్ సముద్రాల రమాకాంతాచార్యస్వామివారు** మొదలగు పెద్దల సలహాలతో, సమయాన్ని వెచ్చించి అందంగతీర్చిదిద్దిన శ్రీపాంచరాత్రాగమ కళాశాల ప్రధానాచార్యులు **శ్రీమాన్ ముడుంబ మధుసూదనాచార్యులకు** అనేక మంగళాశాసనాలు చేస్తున్నాం. అలానే శ్రద్ధతో అక్షర కల్పన చేసిన **JET,** పరిశోధనాలయ బృందానికీ, ముద్రించిన శ్రీమాన్ ప్రెస్సు బృందానికీ అనేక మంగళాశాసనములు చేస్తున్నాం.

ఈగ్రంథమునందు. ప్రామాదికముగ ఏమైనా లోపములు దొర్లిఉండవచ్చు, వాటిని గమనించిన పెద్దలు విద్వాంసులు సూచించినచో తిరిగి వాటిని సంస్కరించుకోవడానికి మన శ్రీపాంచరాత్రాగమ పరిశోధన మండలి సదా సిద్ధమై ఉంటుంది.

శ్రియఃపతి తన మార్గములో మనలను నడిపించుగాక!

జై శ్రీమన్నారాయణ!

(శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయరుస్వామి)

# పీఠిక

అఖిల భువన జన్మస్థేమభంగాది లీలుడగు శ్రీమన్నారాయణు నాశ్రయించుటకు, అతని యధీనమందుకల పరమానంద మందుండుటకు, అందుల కనురూపమైన స్వస్వరూపము నెఱుంగుటకే లభించినదీ మానవజన్మయని ఆస్తిక దార్శనికుల విశ్వాసము. జీవుడు భగవదధీనమైన స్వరూప స్వభావములు కలవాడు. జ్ఞానము కలవాడు. ప్రవృత్తి లక్షణమగు జ్ఞానప్రేరణచే తను చేయు వ్యాపారములన్నియు క్రమబద్ధమగు ఇహలోకజీవనయాత్ర కనువైనవియు, శరీరపాతానంతరము అపునరావృత్తి లక్షణ మోక్షప్రాపకములై నవియు కావలయును. అందుల కనువగురీతిలో శిక్షణాత్మకముగ జీవనము సాగించుట కేర్పడిన నియమములే సాధనములు. ఆ సాధనములను వివరించుటకే తన్త్రశాస్త్రము లేర్పడినవి. భిన్నాభిప్రాయములు కలవ్యక్తులచే ప్రవర్తింపచేయబడిన ఈ తన్త్రములున్నూ విభిన్నములై వెలసినవి. అయినను వీటికన్నింటికి వేదమే మూలము, వేదమును ఆగమము, శ్రుతి, ఆమ్నాయాది నామములతో వ్యవహరింతురు.

'వేదాక్షరాణి యావన్తి పఠితాని ద్విజాతిభిః,
తావన్తి హరినామాని కీర్తితాని న సంశయః'

'వేదాక్షరములెన్ని పఠింతురో, అన్ని శ్రీహరినామములు కీర్తించినట్లు' అను ప్రమాణము బట్టియు, 'వేదైశ్చసర్వై రహమేవ వేద్యః' అను భగవద్గీతా వాక్యమును బట్టియు, వేదాక్షరరాశి యంతటిచేతను ప్రతిపాదింపబడు వాడొక్క శ్రీమన్నారాయణుడే. వేదరాశియంతయు అతని నొక్కనినే తెల్పుటచేతను, పొందించున దగుటచేతను దానికి 'ఏకాయనము' అనునది అన్వర్థనామధేయము. భగవాన్ బాదరాయణుడు వేదరాశి నంతటిని ఆలోధనచేసి, ఋగ్వేద, యజుర్వేద, సామవేదాది రూపముగ నిర్దేశింపగ మిగిలిన మూలవేద రాశికి మాత్రము ఏకాయనమను నామము స్థిరపడి ఉండవచ్చును. దానిని అనుసరించువారు ఏకాయనవిదులు. కొందరు దార్శనికులను కూడా ఏకాయనులనుట కూడ కలదు.

సాంఖ్య, యోగ, కాపాల, పాశుపత, శుద్ధశైవాది భేదేన తంత్రములు అనేకములు. అవి తెలుపు సాధన తత్ఫలములు, అనేకములున్నను, ఆ

సాధనానుష్ఠానము లన్నియు దుశ్శకములు, ఆ తంత్రములు శ్రుతివిరుద్ధార్థ ప్రతిపాదకములును అగుటచే శిష్టులెవరును వాటిని పరిగ్రహింపరైరి. అందుచే శ్రీమన్నారాయణుడే స్వయముగ ఏకాయన శ్రుతుల ననుసరించునవి, అనుష్ఠించుటకు సుశకమైనవి, శీఘ్ర ఫలదాయకములు, శాశ్వత నిత్యానంద సంధాయకములునగు తంత్రములను వెలువరించెను. సాక్షాద్విష్ణుముఖకమల నిస్సృతములగుటచే వానిని వైష్ణవాగమములని, నారదుడు వానిని వినిపించెనని భారత మోక్షధర్మమందు **'నారాయణముఖోద్గీతం నారదోఽ శ్రావయత్పురా'** అని కలదు. భగవానుని పొందించు భగవదుక్త తంత్రమగుటచే **'భగవచ్ఛాస్త్ర'** మనికూడాఅందురు. ఐదురాత్రులందు ఉపదేశించిన గ్రంథమగుటచే ఈ వైష్ణవాగమములను **'శ్రీపాంచరాత్ర'**మని అందురు. సాంఖ్య, యోగ, కాపాల, పాశుపత, శుద్ధ శైవములను ఐదు తంత్రములను రాత్రివలె అప్రకాశకమొర్చు అసమాన ప్రకాశముకల వగుటచే గూడ ఈ వైష్ణవాగమములను 'శ్రీపాంచరాత్ర'మని వ్యవహరింతురు. విఖనసమహర్షి తచ్ఛిష్య ప్రోక్తములగు వైఖానసాగమములున్నూ శ్రీపాంచరాత్రము వలె విష్ణు పారమ్య ప్రతిపాదకములే. కొలది సిద్ధాన్తభేదము తప్ప మిగిలిన లక్షణములు రెంటికిన్ని సమానమే అనవచ్చు. శ్రీపాంచరాత్రాగమమునకు ప్రతిపాదకములు 108 సంహితలని - ఈ క్రింది సంహితా శ్లోకములను బట్టి తెలియుచున్నది.

**సంవర్తః :- శతమేక మధాష్టౌ చ పురాణే కణ్వ శుశ్రుమ।**
**నామధేయాని చైతేషాం శ్రూయతాం కథ్యతే మయా॥**

సుమారు 240 సంహితలున్నట్లు పాశ్చాత్యపరిశీలకుల అభిప్రాయము, అదట్లుండ తిరిగి 108 సంహితలయందు ప్రతిపాదించబడిన శ్రీపాంచరాత్రము నందు 4 విధములగు ఆరాధనా పద్ధతులున్నట్లు పాద్మ సంహిత.....

**ఋగాది సంజ్ఞయావేద శ్చతుర్ధా భిద్యతేయథా।**
**తద్వత్సిద్ధాన్త భేదేన పంచరాత్రం చతుర్విధమ్॥**
**అను శ్లోకము వలన తెలియుచున్నది.**

ఈ సంహితలలో కొన్ని కొన్ని సంహితలు కొన్ని కొన్ని విషయములపై తమ దృష్టిని కేంద్రీకరించినట్లు భావింపబడుచున్నది. ఉత్సవ ప్రక్రియకు ప్రాధాన్యాన్నిచ్చిన సంహితలు కొన్ని, నిత్యవిధికి ప్రాధాన్యమిచ్చిన సంహితలు కొన్ని, విశేష కార్యక్రమము లకు ప్రాధాన్యము నిచ్చినవి కొన్ని, యజ్ఞ యాగాదులనే ప్రధానముగా

తెల్పునవి కొన్ని, భగవన్మూర్తి లక్షణములను విపులీకరించునవి కొన్ని, అందుచేత ప్రతి సంహిత పరిపూర్ణ తంత్ర నిర్ణయము చేయజాలక మొత్తము మీద అన్నింటిని సమీకరించినచో మాత్రమే సంపూర్ణ తంత్ర నిరూపణ నిర్దుష్టముగ కొంతవరకయిన చేయ వీలగును.

ప్రస్తుతము ఆలయ నిత్యవిశేష విధుల కార్యక్రమముల నిర్వహణకు సంబంధించినంతవరకు మాత్రము గ్రహించినచో లభించిన సంహిత ద్వారా ఒక నిర్దుష్టాభిప్రాయ మేర్పడుట కాటంకము లేదు. సంహితా సాంకర్య దోషమనెడి ఒక పక్షమున్నను దాని అభిప్రాయము వేరు. **'అన్యతంత్రములకు చెంది, విరుద్ధాభిప్రాయ ప్రతిపాదకములై, 108 కంటె బాహ్యములగు సంహితల సాంకర్యము శ్రీపాంచరాత్ర సంహితలతోకూడదు'** అని దానికర్థము. శ్రీపాంచరాత్రమంగి అని భావించినచో 108 సంహితలు తదంగములు. అంగములన్నియు కలసిననేగద 'అంగి' ఏర్పడునది. అందుచే సంహితా సాంకర్యము దోషమనుటదగదు. 108 సంహితలచే ప్రతిపాదింపబడు విషయమొక్కటియే గనుక వీని ఐక్యశాస్త్ర్యమునకు భంగములేదు. సంహితాభేదమే గాని లక్ష్యభేదమేమియు లేదు. పురుషార్థ ప్రతిపాదనమందు భేదములేదు.

ఈ శ్రీపాంచరాత్ర సంహితలను గురించి భగవదాలయారాధనానుకూలమగు ప్రయోగములను ఎన్నింటినో ఎందరో యిప్పటివరకు అనేకముగ చేసియే యున్నారు. అయినను యిప్పుడీ ప్రయోగమును సంకలనము చేయవలసిన అవసర మేర్పడుటను గూర్చి కొలదిగ ప్రస్తావించుట అత్యావశ్యకము.

భగవత్ప్రతిపాదకములగు శ్రీపాంచరాత్ర సంహితల ననుసరించి, ఆయా సందర్భము ననుసరించి (కాల, పరిస్థితులు) భగవంతుని ప్రతిష్ఠ భిన్న రీతులలో జరుపబడేదని తెలియుచున్నది. ఆయా ప్రతిష్ఠిత భగవన్మూర్తి ననుసరించి ఆరాధనా పద్ధతులను కూడ భిన్నరీతులలో శ్రీపాంచరాత్రమే విభాగించి సిద్ధాన్త పరచినది. అట్టి సిద్ధాంతములు ప్రధానముగ నాలుగున్నట్లు పైన ఉదాహరించిన ప్రమాణము వివరిస్తున్నది. అవి మంత్ర, ఆగమ, తంత్ర, తన్త్రాంతరములని. వేదరాశి నంతనూ అధికరించలేనివారికై ఋగ్వేద, యజుర్వేద, సామవేద, అధర్వవేదములను నాలుగుగ విభజించి, ఆయా అధికారులకు ఉపదేశించినట్లే అధికారులు తమ శక్తిననుసరించి యర్చించుటకు, శ్రీపాంచరాత్రముకూడ భగవానునిచే నాలుగు విధములుగ విభజింపబడినది.

ఏకమూర్తి ప్రధానంతు మన్త్ర సిద్ధాన్త ముచ్యతే।
చతుర్మూర్తి ప్రధానంతు యత్తదాగమ సంజ్ఞితమ్॥

సిద్ధాన్తముచ్యతే సద్భిః ద్వితీయం లోకవిశ్రుతమ్।
నవమూర్తి ప్రధానఞ్చ తన్త్ర సిద్ధాన్త ముచ్యతే॥

చతుర్వక్త్రేత్రివక్త్రే వా దేవే యత్రాఽర్చనావిధిః।
తత్తంత్రాన్తరమిష్టం స్యాత్తం త్రమేత చ్చతుర్విధమ్॥

ఈ 108 సంహితలలో ఒక్కొక్క సిద్ధాంతమును వివరించుటకు కొన్ని కొన్ని సంహితలేర్పడినవని దీనిని బట్టి తెలియుచున్నది. ఏ సిద్ధాంతము ననుసరించి ఆలయకర్షణాది ప్రతిష్ఠాంత కార్యక్రమము జరుగునో ఆ ఆలయ నిత్యారాధనాది విశేషములన్నియు ఆ సిద్ధాంతానుసారి సంహితలో తెల్పినట్లే జరుగవలెనని నిర్ణయం. ఇతర సిద్ధాంత సాంకర్యము ఈ విషయములో తగదని,

సాంకర్యం నతుకుర్వీత సిద్ధాన్తేషు పరస్పరమ్।
యది సంకరతో మోహాత్ రాజా రాష్ట్రఞ్చ నశ్యతి॥

యేన సిద్ధాంతమార్గేణ కర్షణాది క్రియాః కృతాః।
తేనైవ సకలంకర్మ కుర్యాత్తంత్ర విభాగవిత్॥

అనే పాద్మ ప్రమాణాన్ని బట్టి తెలియుచున్నది. సిద్ధాంత సాంకర్యముచే కొందరు సంహితా సాంకర్య విషయకముగ భ్రమపడుటయు కలదు.

అయితే శ్రీపాంచరాత్ర సంహితలలో ఎన్నెన్ని సంహిత లేయే సిద్ధాంతానికి చెందినవి అనే విషయము, 108 సంహితలయొక్క నామములు తప్ప చాలవరకు గ్రంథములు లభ్యము కాకపోవుటచే, ఇంతవరకు ననిర్ణయింపబడలేదు.

సంహితా ప్రాధాన్యమునుగాక సిద్ధాంత ప్రాధాన్యమును గుర్తెరుంగుట అవసరము భావముతో గ్రంథనామమును **'శ్రీపాంచరాత్రాగమాంతర్గత మంత్ర సిద్ధాంతానుసారిణి'** అని మేము సూచించుట జరిగినది.

పాద్మ సంహితలో ఈ సిద్ధాంత విషయమై ప్రస్తావించిన స్థలమునందే **'తేష్వయం మంత్రసిద్ధాంతః పాద్మ సంజ్ఞోఽభిధీయతే'**

అనుటచే మన్త్రసిద్ధాన్తము విస్తరించుసంహితలో పాద్మమొకటి అని తెలియు చున్నది. అందున ప్రక్రియయే శ్రీప్రశ్న, విశ్వామిత్రాది సంహితలలో లభించుటచే అనికూడ మంత్ర సిద్ధాంతము ననుసరించి సంహితలని తలంపబడుతున్నవి.

ఈశ్వర సంహిత యందు కూడ ఈ సిద్ధాంత ప్రస్తావన చేయుచు ఆగమ మంత్ర, తంత్ర, తంత్రాంతర అని సిద్ధాంతముల నామములను తెలుపుటలో ముందుగ ఆగమసిద్ధాంతము నుచ్చరించుట వలన ఆ సంహిత ఆగమ సిద్ధాంతాను సారియని భావింపబడుచున్నది. *(ఈ విషయమునే శ్రీప్రశ్నసంహిత పీఠికలో కూడా వివరించిరి).*

ప్రస్తుతము మన ఆంధ్రదేశమున గల అన్ని ప్రసిద్ధ శ్రీవైష్ణవ క్షేత్రములందును, దక్షిణ దేశమందుగల చాలావరకు శ్రీవైష్ణవ క్షేత్రములయందును కల ఆరాధన పద్ధతియు మంత్రసిద్ధాంతానుసారవే కలదని పరిశీలకులందరును అభిప్రాయమును వెలుబుచ్చిరి. ఆయా ఆలయ ప్రతిష్ఠాదికము లట్లేజరిగి యుండవచ్చు. అందులకు కారణము, ఆగమ మొదలగు సిద్ధాన్తముల ననుసరించి ఆరాధనాదులను నిర్వహించుటలోగల శ్రమయే కావచ్చు.

మన్త్రసిద్ధాంతమునకు పాద్మసంహిత ప్రధానమైన దగుటవలన ప్రయోగ గ్రంథములను వ్రాయు వారలందరును **'పాద్మసంహితోక్తవిధిః'**, యనో **'పాద్మ సంహితాను సారిణి'** యనో తమగ్రంథములను వెలువరించుట ఆచారమైనది.

పాద్మ సంహిత నిత్యారాధన మొదలు ప్రతిష్ఠాంతము వరకు గల విధినంతను లభించిన అనేక సంహితలకంటే సమగ్రముగనే వివరించినదనుట నిస్సంశయము. అంతియేకాక మిగిలిన సంహితలకంటే ఈ సంహిత యొక్క ప్రాచీనత్వమును ఆధునిక పరిశీలకులుగూడ అంగీకరించుట విశేషము. అయిననూ ఈ సంహిత, మన్త్రసిద్ధాన్తమును వివరించే అనేక సంహితలలో ఒకటనే విషయము మరువతగనిది.

ఆ సిద్ధాంతము ననుసరించి ప్రయోగము కూర్చునపుడు ఆ సిద్ధాన్తము ననుసరించు అన్ని సంహితలనూ పరిశీలించుట, వాటన్నింటియందు చెప్పబడినట్లుగ ప్రయోగమును రూపొందించుట తప్పనిసరి, సరియైనదిగూడ.

అందుచే సిద్ధాన్తముల యందుకల వైవిధ్యమును గూర్చి, వాటి సాంకర్యమందు గల దోషములను, ప్రయోగముల యొక్క కూర్పునందు ఏకసిద్ధాన్తానుసరణను గూర్చి '**మైసూరు మహారాజా సంస్కృత మహావిద్యాలయ శ్రీ పాంచరాత్రాగమ విద్వాంసులగు శ్రీమాన్ ఫణిపురం రంగభట్టాచార్యస్వామివారు**' తమ '**నిత్యార్చనా పద్ధతి**' అను గ్రంథ ప్రస్తావనయందు చూచాయిగ స్పృశించి విడచిరే తప్ప ఏ ఏ సంహితలు ఏ సిద్ధాన్తమునకు చెందినవనే విషయమై వారు ప్రస్తావించలేదు.

అయితే వారు '**పాద్మసంహిత**' ఒక్కటే మన్త్రసిద్ధాన్తానుసారిణి అని అభిప్రాయపడినట్లు వారి ఉపోద్ఘాతమును బట్టి తెలియుచున్నది.

అందుచే వారి 'నిత్యార్చన ప్రయోగ గ్రంథ శీర్షిక' కూడ '**పాద్మ సంహితానుసారిణి**' అని వెలువడినదికాని అందు స్వీకరించిన మంత్ర ప్రక్రియలు యింకనూ చాల సంహితలనుండి సేకరించినట్లు వారే తెల్పిరి, '**అనుక్తమన్యతో గ్రాహ్యా**' మనే నియమము ననుసరించి వారుచాల విషయములను ఈశ్వరాది సంహితల నుండి గ్రహించిరి.

పై నియమము అందరునూ అంగీకరించినదే అయిననూ, మన్త్రసిద్ధాన్తమునకు చెందిన సంహితలు యింకనూ ఉన్నచో మొదటి ప్రాధాన్యము వాని కొసంగి, వాని యందుకూడ కావలసిన విషయము లభ్యముకానిచో అపుడుగద '**అన్యతో**' గ్రహణమవసర పడునది!.

మన్త్ర సిద్ధాన్తము ననుసరించినవని మా పరిశీలనలో నిర్ణయింపబడి, యిప్పటికి లభ్యమగుచున్న శ్రీప్రశ్న, విశ్వామిత్ర, విష్ణుతిలకాది సంహితలలో '**నిత్యార్చన వరకు పరిశీలింపగ**' కావలసిన విషయమంతయు పాద్మసంహితాను సారముగనే పూర్తిగలభించినది.

ఒకచోట సూక్ష్మముగనున్న విషయమును మరొక సంహితలో విస్తరింపచేసి చూపుచూ, అట్లే ఒకచోట విపులముగ గల విషయమును మరొక సంహితలో సూక్ష్మీకరింపజేయుచు ప్రవర్తించు మన్త్రసిద్ధాన్తానుసారిణులగు సంహితలే '**పాద్మ, శ్రీప్రశ్న, విశ్వామిత్రాది**' సంహితలు కావున మిగిలినవనన్నియు ప్రస్తుతము స్పృశింపక ఈ పైవాటిననుసరించే మేమీ గ్రంథముయొక్క కూర్పునకుపక్రమించితిమి. ఇక ఈశ్వర సంహిత ఆగమసిద్ధాన్తమునకు చెందినదగుటచే దానిని మేము స్పృశింపలేదు. అవసరమురాలేదుగూడ.

ఇక మిగిలిన యిప్పటి ప్రయోగ గ్రంథములన్నియు మైసూరు వారినే చాలావరకు అనుసరించినవగుటవలన వాటి ప్రస్తావనే అనావశ్యకము.

ఇట్టి అన్ని విషయములను దృష్టియందుంచుకొని మిగిలినవారు **'పాద్మసంహితోక్త'** **'పాద్మ సంహితానుసారిణీ'** ఇత్యాదిగ సూచించిననూ, మేమూ **'శ్రీపాంచరాత్రాగమాంతర్గత మన్త్రసిద్ధాన్తానుసారి'** అని సూచించుట జరిగినది.

ఇందు - సంహితననుసరించియు, అనుభవజ్ఞులు, పండితులు పరంపరాగత సంప్రదాయజ్ఞులునగు శ్రీ **ఉ.వే.శ్రీమాన్ పెరియతిరువడి భట్టరుస్వామి** (తమిళనాడు లోని ఆళ్వార్ తిరునగరి వద్దకల శ్రీవైకుంఠక్షేత్రం) మొదలగు పెద్దల సమగ్రమైన పరిశీలనానంతరము ప్రయోగమును కూర్చుట జరిగినది.

ఇక ఆరాధనయందుపయుక్తమగు న్యాసములు, వేద ఇతిహాసాది పారాయణక్రమము, మంగళాశాసనము, శాంతిపాఠములు, అష్టోత్తరములు ముద్రలు మున్నగునవి అనుబంధములు చివరచేర్చబడినవి. అన్ని ఆలయము లందును ఒకేరీతిలో ఆరాధన జరుపుట శోభదాయకమనియు, అత్యంత అవసర మనియు ఒక శ్రీవైష్ణవుడు ఏ ఆలయమునకు వెడలిననూ, అనుసంధించు రీతి తెలియక బాధపడరాదను అభిప్రాయముతో ఈ అనుబంధములను కూర్చుట జరిగినది.

ఇట్లు
**శ్రీపాంచరాత్ర పరిశోధన మండలి**
నడిగడ్డపాలెం, సీతానగరం
గుంటూరు జిల్లా, ఆంధ్రప్రదేశ్.



# ఈ ప్రయోగ గ్రంథమందు చేయబడిన సంస్కరణలను గూర్చి కాలదిగ ప్రస్తావన:

1. ఆరాధనకై అర్చకుడు ధ్వజస్తంభముదాటి లోనికి ప్రవేశించునపుడు చండ ప్రచండ నమస్కారానంతరము 'గత్వాంగన్యాసపూర్వకం' అని అంగన్యాసము చేయవలయునని యున్నది. ఇచ్చట సాధారణముగా 'జ్ఞానాయ హృదయాయ నమ' ఇత్యాది అంగన్యాసము సాధకుడు చేసుకొనవలయునని చాలా ప్రయోగ గ్రంథము లలో గలదు. సాధకుడు చేసుకొనవలసిన అంగన్యాస కరన్యాసములు మానస యాగమునకు ముందు కలవు.

A. రాత్రి భగవంతుని శయనింపజేసి కవాట బంధనమయిన తరువాత సుదర్శనుని, ఆపై చండప్రచండులను ద్వారరక్షణకై సంబోధించి గృహమునకు వెడలవలయునని శ్రీప్రశ్న సంహితలో యున్నది. తిరిగి ఉదయం లోనికి ప్రవేశించునపుడు గూడ చండప్రచండుల అనుజ్ఞ తీసుకొని సుదర్శనుని సంబోధించియే ద్వారము తెరచుట క్రమముగదా! ఇచ్చట ఆ ప్రకారమే చండప్రచండ నమస్కారానంతరము సుదర్శన - సంబోధన స్థానమందు అంగన్యాసము చెప్పబడియున్నది. కనుక ఈ అంగన్యాసము సుదర్శన సంబంధితము తప్ప వేరుకారాదు. మరియు దక్షిణదేశమునందలి సుప్రసిద్ధ దేవాలయముల యందు కూడ ఇచ్చట చేయబడు అంగన్యాసము సాధకునకు గాక ఈ ప్రయోగ గ్రంథములో చూపబడినట్లుగా 'ఓం ఆచక్రాయస్వాహా....' ఇత్యాది సుదర్శన షడంగన్యాసమే కలదు. సంహితయందుకూడ ఇచ్చట ఏ అంగన్యాసమో స్పష్టముగా చెప్పకపోవుట సంశయమునకు దారితీసినది. పూర్వాచార్యానుగృహీత అనుష్ఠానము స్వీకరించి ఈ ప్రయోగగ్రంథమున అంగన్యాసము సుదర్శన పరముగ చూపడమైనది.

2. ఆంధ్రదేశమున గర్భగృహద్వారమునకు ఎదురుగా ఘంటను వ్రేలాడదీయుట, లోనికి ప్రవేశించునపుడు భక్తులతోసహా ఆ ఘంటను మ్రోగించి లోనికి పోవుట బహుళముగాకలదు. విష్ణ్వాలయమునకు అట్టి అవసరం లేదు. అన్యపరులై ఉండు వ్యక్తుల వద్దకు చేరునపుడు వారి దృష్టిని తనవైపు మరల్చుకొనుటకు ఘంటానాదమువంటిది అవసరమే తప్ప, సదా ఆర్తత్రాణ పరాయణుడై వారికై ఎదురుజూచు అర్చామూర్తియైన శ్రీమన్నారాయణుని సన్నిధికి

చేరునపుడు చేతులు జోడించి నమస్కరించుటే చాలును. అందుచేతనే ఏ సంహితయందునూ ఇట్టి ఘంటను వ్రేలాడదీయు ప్రస్తావనలేదు. దక్షిణదేశము నందెచ్చటనూ కూడా విష్ణ్వాలయముల యందు, గర్భగృహద్వారమునకు ఎదురుగా ఘంట వ్రేలాడదీయబడి ఉండదు. ఇక మండపము నందు ఈశాన్యమూల ఒక ఘంటను వ్రేలాడదీసి, కవాటోద్ఘాటన, జలాహరణ, నివేదన, బలిహరణాదుల సమయములను సూచించుచు ఘంటను మ్రోగించుదురు. అదే 1వ పేజీలో, 4వ పేజీలోను క్రింద సూచించబడినది.

3. కవాటోద్ఘాటనము చేయునపుడు జరుపు తాళత్రయము కుడిచేతితో ఎడమ చేతిలో, తరువాత ఎడమ చేతితో కుడిచేతిలో తిరిగి కుడి చేతితో ఎడమ చేతియందును చరుచవలయును. దీనివల్ల దుర్మరణములు వ్యాధులు తొలగి సుఖములు కలుగుననెడి ప్రమాణము కూడ చూపబడినది.

4. ఆలయములోనికి ప్రవేశించునపుడు 'సామ్నా దేవ వ్రతేనాన్తః ప్రవిశేద్దక్షిణాంఘ్రిణా' అను శ్లోకమునుబట్టి దేవవ్రత సామము నుచ్చరించవలెననే అందరు ప్రయోగ కర్తలు తెలిపితిరే తప్ప ఆ మంత్రమును తెలుపలేదు. ఈ ప్రయోగ గ్రంథమందు ఆ మంత్రముగూడ చూపబడినది.

5. బాహ్యారాధనకు ఉపక్రమించుటకు ముందు సాధకుడు ఐదు శుద్ధులు జరుపవలయునని నియమము. అవి క్రమముగా స్థాన, పాత్ర, బింబ, భూత, మంత్ర శుద్ధులు స్పష్టముగా తెలియుటకొఱకై సంఖ్యాక్రమముగా ఇందు వాటిని తెలియజేయుట జరిగినది.

6. భగవంతుని మేల్కొలుపునపుడు ఎన్నో రకముల సుప్రభాత స్తోత్రములు అనుసంధించుట గలదు. ఏ స్తుతియైనను భగవంతుని కీర్తించుటకు యోగ్యమైనదియే కనుక అవన్నియు చేయుట యందు అభ్యన్తరమేమియు లేకున్ననూ అన్ని ఆలయములకు తగిన సుప్రభాత స్తోత్రము ఇందు చూపబడినది. ఇది అయిన తదుపరి ఆయా ఆలయములందుండెడి రామ, కృష్ణ, నృసింహ, వేంకటేశాది మూర్తులను బట్టి స్తోత్రపాఠకుని శక్తినిబట్టి ఎన్ని విష్ణుస్తోత్రములైననూ అనుసంధించవచ్చును. ఇచ్చట ప్రయోగమందు దానిని గమనించవచ్చును. ఈ ప్రాబోధక స్తోత్రము పరమేశ్వర సంహిత నుండి గ్రహించబడినది. ఇది తప్ప హరియొక్క స్తోత్ర విషయమునుగూర్చి ఏ యితర సంహితల యందును కనబడదు. అందుచే అన్ని శ్రీవైష్ణవ దివ్యస్థలములందును దీనినే మొదట అనుసంధించుట ఉచితము.

7. భగవంతుని పరిపూర్ణతేజస్సు ధృవమూర్తి యందు నిక్షిప్తమై యుండును. అయా ఉపచారములు స్వీకరించుటకు నిర్దేశింపబడిన బింబములందు సాధకునిచే అవాహింపబడి ఆయా బేరములద్వారా ఆయా ఉపచారములను ధృవమూర్తిగ నిలచిన భగవానుడు స్వీకరించును. బేరములనగ మూర్తులు విగ్రహములు. అట్టి బేరములు శ్రీపాంచరాత్రానుసారము ఆరుగ నిర్ణయింపబడినవి. వీనినే 'షడ్బేరములు' అందురు. అవి ధృవ, (మూలవరులు) కర్మార్చ, స్నపన, బలి, యాత్రా, శయన బేరాలు. ఈ రోజులలో బహుకొద్ది ఆలయములలో మాత్రమే షడ్బేరవిధానముగా ఆరాధన జరుగుచున్నది చాల ఆలయములలో ధృవ, కర్మార్చలు మాత్రమే కలవు. కొన్ని ఆలయములలో బలిబేరము కూడ ఉండుట కలదు. షడ్బేరనియమముతో అన్ని ఉపచారములు సాగకపోయిననూ ఉన్న బేరములతోనే ఆయా ఉపచారములు జరుపుకొనుట యందు ఆక్షేపణ ఏమీయు లేదు.

ధృవబేరము స్థిరముగా ఆలయమునందే ఉండునది. సకల కళాపూర్ణము. ధృవమూర్తినుండి స్నపన, బలి, యాత్ర, శనయబేరములలోనికి ఆయా ఉపచారములకు అవసరమగు రీతిలో భగవచ్ఛక్తిని ఆవహింపచేయుటకు కర్మార్చబేరము ద్వారముగ (మధ్యవర్తి) వినియోగింపబడునది, ఇటులనే ఆయా ఉపచారములు పూర్తియైన పిదప అందావహింపజేసిన భగవచ్ఛక్తిని ధృవమూర్తి యందు తిరిగి చేర్చుటకును ద్వారముగ వినియోగింపబడునది కూడ కర్మార్చామూర్తియే స్నపనబేరము కర్మార్చామూర్తి నుండి శక్తిని పొందిన పిదప స్నాన ఉపచారము నుండి భోగదాన పర్యంతము (ఆరగింపు) జరుగు ఉపచారములు స్వీకరించుటకు వినియోగింపబడునది. తదుపరి తదావాహిత శక్తి కర్మార్చాబేరము నందే చేర్చవలయును. దీనిద్వారా తిరిగి ధృవమూర్తికి చేరుచుండును. బలిబేరము కర్మార్చనుండి ఆవహింపబడిన శక్తిని పొంది బలిహరణకు ఉపయోగింపబడును. మరల అందలి ఆవాహితశక్తిని కర్మార్చద్వారా ధృవమూర్తికి చేర్చవలయును.

యాత్రాబేరము, కర్మార్చ నుండి గ్రహింపబడిన భగవచ్ఛక్తితో తిరువీధి ఉత్సవములకు ఆర్జిత సేవలకు ఉపయోగింపబడును. ఉత్సవము పూర్తికాగానే తిరిగి కర్మార్చద్వారా తచ్ఛక్తిని ధృవమూర్తియందు చేర్చుదురు.

కర్మార్చనుండి పొందిన శక్తికల శయనబేరమునకు రాత్రి శయనోత్సవమును (పవళింపు సేవకు) వినియోగింపబడును. తదావాహిత శక్తిని మరునాటి ఉదయము సుప్రభాతము తరువాత కర్మార్చద్వారా ధృవమూర్తిలో ప్రవేశింప జేయుదురు.

ఉదయము ధృవబేరము నుండి నియమమునను సరించి కర్మార్చయందు ఆవహింపజేసిన శక్తిని రాత్రి శయనోత్సవానంతరము (శయన బేరము నందుండెడి భగవదంశ తప్ప మిగిలినఅంశలను) ధృవమూర్తి యందు చేర్చవలయుననెడిది సంప్రదాయము. శయనబేరమందలి భగవదంశను సుప్రభాతానంతరము భద్రాసనము నందు శయనబేరము నుంచిన తరువాత కర్మార్చ ద్వార మూర్తి యందు చేర్చుట నియమము. అంతవరకు శయనబేరము ఉపయోగపడును. కర్మార్చనే 'ధృవకౌతుక'మని కూడ అందురు. అనగా కర్మార్చకూడ ధృవమూర్తివలె ఇటూనటూ కదల్చదగనిదే అని అభిప్రాయము. అందువల్లనే కర్మార్చద్వారా మాత్రమే భగవచ్ఛక్తిని ఇతర బేరములలోనికి ఆవాహన చేయుట తిరిగి మూలములోనికి చేర్చుట జరుపవలయును.

ప్రభాతారాధనానంతరము నివేదన చేయునపుడు ఈ శయనాది బేరములకు గూడ నివేదనాది ఉపచారములు జరుపుచుండవలయును. ఈ పై ప్రక్రియ నిగూఢముగా సంహితల యందుండుటచే అధికశాతము దీనిని ఆచరించుట విడచిరి. ఆవాహనాదులు లేకయే 'బేరములకు పెద్దపెద్ద ఆలయాలలోగూడ ఉపచారములు జరిగిపోవుచునే యున్నవి. కొన్ని చోట్ల కొన్ని స్థానములలో మూర్తులను ఆటబొమ్మవలె ఉపచరించుట కూడ కలదు. ఆలయమునందుండెడి ప్రతి వస్తువునందు భగవత్కృప నిండియుండును గదా! సాక్షాత్తు భగవదారాధనకు వినియోగింపబడు వస్తువులందు నిత్యసూరులే నివసింతురు. వాటినే ఎంతో నమ్రతతోఉపచరించవలెనే. అట్టితరి సాక్షాత్ భగవచ్ఛక్తిని స్వీకరించుటకు యోగ్యతనందిన ఆ బేరములను ఎంతో వినయ విధేయతలతో ఆదరణతో ప్రీతితో ఉపచరించవలయును. 'శయనబేరమందలి శక్తిని కర్మబేరముద్వారా మూలబేరము నందు వినియోగించవలయును' అని ప్రయోగమందు చూపబడినది. ఈ క్రమము లోపించి పోవుచుండుటచేతను, ఆరాధకులకు, ఇట్టి విషయమొకటి ఉన్నదని తెలిసినచో ఇది తెలియదగినదని గుర్తించి తెలియజేయుట కర్తవ్యమని ఎందరో పెద్దలు అభ్యంతరపెట్టుచున్ననూ ఈ క్రమమును ఇచ్చట వెలువరించు చున్నాము. దీనిని దృష్టియందుంచుకొనే ధృవమూర్తి నుండి గ్రహించు అంశాలు ఏయే బేరమునకు ఎన్నెన్ని మొదలగు విషయములు ఉపదేశగమ్యములు. శిష్టులగు పెద్దలనాశ్రయించి వారి ద్వారా తెల్సుకుని ఆచరింతురను అభిప్రాయముతో దీనిని ఇక్కడ వివరించుట జరిగినది.

ఈ నియమము ఆయా ఉపచార సమయమందు యేయే విధముగా చేయవలయునో ప్రయోగమందు గమనించవచ్చును.

సాలగ్రామమూర్తులను, స్నపనబేరము ఉన్ననూ లేకున్ననూ స్నానోపచారము నకు వినియోగించవలెను. అయితే స్నపనబేరమున్నపుడు ముందుగ బేరమునకు స్నానోపచారములనన్నియు పూర్తిచేసి అపుడు సాలగ్రామమూర్తులను అభిషేకించ వలెను. లేదా ముందుగనే సాలగ్రామ స్నపనముగావించి ఆపైననూ బేరములకు స్నానమర్పించవచ్చును. ఏమైననూ, రెంటికీ కలిపి ఒకేసారి ఉపచారము తగదు.

యాత్రాబేరములేనపుడు, బలిబేరమునే ఆ ఉపచారము స్వీకరించుటకు ఉపయోగించవచ్చును.

బలిబేరముకూడ లేనిచోట బలి, యాత్రా శయనములకు మూడింటికిని స్థండిలమందో కూర్చయందో భగవచ్ఛక్తిని ఆవాహన చేసి ఆ ఉపచారము జరుపుకొన వచ్చును.

గ్రామోత్సవాదులకు ఈనాటి పరిస్థితులననుసరించి ప్రత్యేక యాత్రా బేరము లేనిచోట కర్మార్చనే ఉపయోగించుచున్నారు. అపుడు కర్మార్చకొరకై ఒక చిన్నమూర్తిని ఏర్పాటు చేసుకొనుట ఉత్తమము. ఏమైననూ కర్మార్చకూడా కదలకూడనిదై ఉండుట మంచిది. ఈ విషయముకూడ ఈ ప్రయోగ గ్రంథమున ఆయా స్థానమున గమనించవచ్చును. అచ్చటచ్చట క్రింది సూచిక యందు కూడ వివరించబడినది. ఏతావతా బేరములు లేకున్ననూ షడ్బేరార్చన నిత్యము జరుగవలసినదేయని గమనించవలెను.

8. భూతశుద్ధి ప్రారంభించునపుడు సంహితయందున్న **'తూర్య ఘోషే ప్రవర్తితే'** అను దానికి అనేక ధ్వనులతోపాటు ఘంటానాదము కూడ చేయదగునని ఆధునిక ప్రయోక్తలు ఇచ్చట ఘంటాపూజాదులను చేయుటగలదు. వీనితో పాటు **'ఆగమార్థంతు దేవానాం గమనార్థంతు రక్షసాం.......'** అనెడి శ్లోకము అందరిచేతను అనుసంధింపబడుచున్నది. 4వ పేజిలోని ప్రమాణమును బట్టి నాదము చేయుదగును. శ్లోకమనవసరము. ఆలయములందు ఉపయోగింపబడు వస్తువులన్నియును తత్తద్దేవతాధిష్ఠితములయ్యే ఉండును. ఘంటయును అట్లే అందుచేత ప్రత్యేకము ఘంటాపూజ అవసరములేదు. ఇక ఆలయమునందు యోగపీఠము మొదలుకొని ధ్వజస్తంభమునకు బయట ఉండు ప్రాకారము వరకు

కూడ అన్ని దిక్కులయందు ఆయాదిక్కులను పాలించు దేవతలు అప్రమత్తులై రక్షించుచుండుటకు ప్రతిష్ఠా దినమునాడే స్థాపింపబడియుందురు. వారచ్చట ఉన్నంతవరకు రాక్షసులెవ్వరును అచ్చట ప్రవేశించరు. అట్లు ప్రవేశించిన అచ్చట భగవానుడు లేడనే అర్థముకదా! గర్భగృహములో ఆరాధనచేయు అర్చకుడు ఆ గర్భగృహమునకు క్రొత్తగా దేవతల నాహ్వానించుటగాని లేని రాక్షసులను తొలగించుట గాని చేయనవసరం లేనే లేదు. అందులకై ఆ శ్లోకము ఈ సందర్భమున, అందున గర్భగృహమునందు అనుసంధించుట అనవసరము. సుప్రతిష్ఠిత ఆలయములేని నూతన స్థానములలో జరుపు క్రియలలో ఈ శ్లోకమునను సంధించుట తగును. అందుచే ఇచ్చట భూతశుద్ధియందు ఘంటను ప్రయోగించమనినపుడు ఏ మంత్రమును అవసరములేదు. తాను యోగాసనమునందు ప్రవేశించుచున్నట్లు తెలియజేయుటకై ఘంటానాదము చేసిన చాలును. ఎచ్చటెచ్చట ఘంటానాదము చేయవలెనో ప్రయోగములో క్రిందచూపబడినది. కాక సాధకుడు ఇకపై జరుపు ప్రణవమంత్రపూర్ణమగు ప్రాణాయామ భూతశుద్ధులలో ఆ ప్రణవ ధ్వని భావనకై సహజముగ ప్రణవమును ధ్వనించు ఘంటానాదమును ధ్వనింపజేసి తదుపరి యోగాసనా రూఢుడు కావలయును. అని ఇచ్చట ఘంటానాదము చేయ వలయునని తెలుపబడినది.

9. భగవదారాధనలో లేక దేవయాజ్ఞికములో ఎచ్చట ప్రాణాయామము న్ననూ అది ప్రణవము చేతనే తప్ప గాయత్రీ మంత్రముతో కాదు. భూతశుద్ధి యందు కూడ మూడుసార్లు ప్రాణాయామము గలదు. ఇవి కూడ ప్రణవముతోటే చేయవలయును. ప్రణవముతో చేయుపద్ధతి 4వ పేజీలో వివరింపబడినది.

10. భూతశుద్ధి :- న్యాసము, యోగము అని రెండుగా విభజించబడినది. ఆరాధనకు ఉపక్రమించునపుడు స్నానాదులవల్ల బాహ్యశౌచము పాటించుట ఎంత అవసరమో మానసిక శౌచముగూడ అంతే అవసరము. ఇది భావనతో జరుపవలసిన క్రియ. దీనికే 'న్యాసము' అని పేరు. న్యాసమనగా ఉంచుట. మంత్రమును మనస్సు నందుంచి మనస్సును మంత్రాధిష్ఠాతయగు మూర్తి యందుంచి ఆ భగవంతుని సర్వశక్తిపంతమగు దివ్యమంగళ విగ్రహము యొక్క సతతభావనా బలముచే పంచభూతాత్మకమగు శరీరము యొక్క ఉపరిభాగమును, అంతర్భాగమును తదారాధన యొగ్యమగునట్లుగా మలచవలయును. అనగా ప్రస్తుతము పాంచభౌతికదేహము భావనలో నిశ్శేషముగా భస్మీభూతము కావలయును. తగినట్లు

తిరిగి సృజింపబడవలెను. దానికి ముందు శరీరము నాశ్రయించియున్న బాహ్యావాసనలు తొలగవలయును. కర్మవల్ల స్నానాదులవల్ల కొన్ని తొలగిననూ భావనతోకూడిన మంత్రశక్తివల్లనే క్రమముగ బాహ్యావాసనల నుండి ముక్తి లభించును. వాయు, అగ్ని, ఇంద్ర, వరుణ బీజములను ధ్యానించుటద్వారా వాసనా విముక్తి సిద్ధించు ప్రక్రియ శ్రీపాంచరాత్రమున కలదు. అది 5వ పేజీలో వివరింపబడినది. దానినాచరించిన పిదపనే పంచభూతములను సంహారన్యాసము ద్వార క్రమముగ లయింపజేసి, సూక్ష్మశరీరమును ఈ పాంచభౌతిక దేహము నందుండి, భగవత్సన్నిధికి చేర్చినట్లు భావన చేయవలయును.

అపుడీ స్థూల శరీరము తనంతను దగ్ధమైనట్లు భావించవలయును. ఇదంతయు మంత్రప్రభావముచే జరుగుచున్నట్లు భావించుటయే తప్ప ప్రత్యక్షముగ జరుపదగినది కాదు. ఇంతవరకు జరిగిన ప్రక్రియను 'తత్వసంహారన్యాస'మని అందురు. ఇక తిరిగి భగవత్సన్నిధిలో ఉన్న సూక్ష్మ శరీరధారియగు సాధకునకు స్థూలశరీరమేర్పడవలయును. అది కేవలము భగవదారాధనకే తప్ప వినియోగపడనిదై ఇతరవాసనలు కాని, కల్మషములుగాని లేని విశుద్ధ దేహమై యుండవలయును. అదియును భావనాయుత మంత్రశక్తి వల్లనే జరుగవలయును. అందులకై గగనములో ఒక సహస్ర దళపద్మము భగవత్కృపచే ఆవిర్భవించి వికసించగల, భగవచ్చరణముల చేరియున్న తాను స్థూలశరీరనిర్మాణార్థము ఆ పద్మమునందు ఆసీనుడైనట్లు భావించవలెను. ఏ క్రమములో తత్వసంహారము జరిగెనో, తిరిగి అదే క్రమములో వెనుకకు సృష్టి జరుపబడినట్లు భావించి, పద్మము నందలి భగవత్పాద తీర్థస్నాతుడై, అలంకృతుడై భగవదారాధనార్హతనందినట్లు భావించవలెను. ఈ ప్రక్రియకు 'తత్వసృష్టిన్యాస'మని పేరు.

ఇట్లు వాసనారహితము, పూతము, నూతనమునయిన దేహమునందలి ఏఏ భాగమున ఏ ఏ బీజములున్న భగవత్సాక్షాత్కారము నందవచ్చునో, అట్టి రీతిలో ఆయా మంత్రబీజాక్షరములను అచ్చటచ్చట, బ్రహ్మచర్యాది ఆశ్రమానుసారము అనుసంధించుటను 'మన్త్రన్యాస'మని యందురు.

ఈ న్యాసము దేహమునందు 5 ప్రకారములుగ అనుసంధించవలయును. ఆ పద్ధతులు సులభముగ తెలియు రీతిలో ప్రయోగ గ్రంథమున విభాగశః సూచించుట జరిగినది.

వాసనారహితము..... మంత్రపూతమునయిన స్థూలపాంచభౌతిక దేహము నందు భగవంతుని స్వరూప, రూప, గుణ, విభూతులతో ఒకసారి భావించి బాహ్యారాధనలో ఎన్నోలోపములు ద్రవ్య, సమయ, భక్త్యాది సంకోచము వల్ల జరుగుచుండునుగాన, అట్టి లోపరహితముగ మానసశక్తి సంజాతములగు భక్తి పూర్ణద్రవ్యములతో అతని పరిపూర్ణ ఆరాధన గావించి, అదేరీతిలో సంభవిత ద్రవ్యాలతో బాహ్యముగ ఆరాధించి, తాననుభవించుటయే గాక భక్తులచేగూడ అనుభవింపజేయుటకై 'ధృవాది' మూర్తులకారాధన నారంభించును. ఇట్లు మనసున జేసిన ఆరాధనను 'మానసయాగ' మందురు.

మానయాగము జరిపిన పిదపనే ధృవ, కౌతుకాది బేరములవద్ద బాహ్యా రాధనకు ఉపక్రమించవలయును. ఈ విధముగా జరుగని ఆలయ సంబంధమైన బాహ్యారాధనము వ్యర్థము. బాహ్యారాధనలో జరిగెడి అజ్ఞాత దోషములు మానస యాగము ద్వారా మాత్రమే కొంతవరకయిననూ తీరును. మానసయాగము సిద్ధించుటకు 'మంత్రన్యాసము' సాధనము. మంత్రన్యాసము వాసనాదూరమై దేహమందు మాత్రమే కొంతవరకయిన ఫలించును. వాసనలు - తత్వసంహార-సృష్టిన్యాసములవల్లనే (భావనచే) కొంత దూరము కాగలవు. అపుడే పంభూతములు విశుద్ధములగును. ఇంత ప్రక్రియ క్రమముగా జరిపిననే అది **'భూతశుద్ధి'** అనిపించు కొనును దీనినే **'ఆత్మశుద్ధి'** అనియు అందరు.

ఆత్మను పరమాత్మ చరణములతో చేర్చుటద్వారనేగద 'శుద్ధి' లభించును. మిగిలినవన్నియు కేవలము అచేతనములగు పంచభూతములకే శుద్ధిని చేకూర్చును. జ్ఞానియగు ఆత్మను పరమాత్మతో చేర్చుభాగ్యము ఈ పద్ధతిలో జరుగునుగాన **'ఆత్మశుద్ధి'** అనియు అందురు.

**అర్థాత్** :- 1) బాహ్యావాసనలు తొలగుట, (5 పేజీలో), 2) పంచభూతములు లయమంది తిరిగి సృజింపబడుట (6-7 పేజీలలో), 3) మంత్రబీజాక్షరములను దేహమునందచ్చుటచ్చుట న్యాసము జేయుట, (8,9,10 పేజీలలో), 4) మనసున భగవదారాధన జరుపుట (11వ పేజీలో) - ఇవన్నియు జరిపినపుడే **'భూతశుద్ధి'** **'ఆత్మశుద్ధి'** జరిగినట్లు లెక్క. ఇందు ఏ ఒక్కటి తగ్గిననూ భూత శుద్ధిలో లోపము జరిగినట్లేయగును. ఇది లేనట్టి ఆరాధన 'బాలక్రీడ' వంటిదే యగును తప్ప లోకక్షేమార్థము కాదగదు.

11. శ్రీపాంచరాత్రాగమమునకు పాద్మసంహిత ననుసరించి మూల మంత్రములు నాలుగు. అవి :- 1) అష్టాక్షరీ, 2) ద్వాదశాక్షరీ, 3) విష్ణుషడక్షరీ, 4) ప్రణవము, సాధకుడు ఆలయములో ఆరాధనలర్పించుటకు పూర్వము, మంత్రదీక్ష స్వీకరించి ఉండవలెను. ఆయా ఆలయమునకు ప్రతిష్ఠాపకులైన ఆచార్యులు ఏ మూలమన్త్రమును గైకొనెనో ఆ మంత్రరీతిలో చక్రాబ్జమండలమున దీక్షితుడు కావలయును. ఆలయ ప్రతిష్ఠ ఏ మంత్రానుసారము జరిగెనో అన్ని ఉపచారములును, ఉత్సవములునూ ఆ మన్త్రానుసారముగనే జరుగవలెననెడిది ఆగమ నియమము. ఇది నూతనముగ ప్రవేశించు అర్చకునకు పూర్వపు అర్చకులు ఉపదేశరూపముగ తెలియజేతురు. ఇది వారికి తప్ప యితరులకు తెలియనవసరము లేదు. శ్రీపాంచరాత్రులు బహుళముగ ద్వాదశాక్షరినే స్వీకరించినట్లు తెలియుచున్నది. ఈనాడు ఆ క్రమములో దీక్షనందు ప్రక్రియ మృగ్యమైనది, అష్టాక్షరీ మంత్రోపదేశమును సంస్కారముద్వారా పొందినవారధికముగ లభించుచున్నారు. అదియుగాక సంప్రదాయేత్తలందరును శిష్టపరిగృహీతమైనదిగ అష్టాక్షరినే నిర్ణయించుటచేతను ఈ ప్రయోగ గ్రంథమునందు మన్త్రన్యాసములు మొదలగునవన్నియు అష్టాక్షరీ మన్త్రప్రక్రియయందే స్వీకరింపబడినవి. పరంపరాగతమగు ద్వాదశాక్షరి దీక్షాస్వీకరణ పద్ధతి అమలులో ఉన్నవారెవరయిన ఉన్నట్లయితే వారి సౌకర్యార్థము ద్వాదశాక్షరిననుసరించిన మంత్రన్యాసములను గూడ (అనుబంధం 1-4 నుండి 2 చూపబడినవి.)

12. న్యాసములు చేయునపుడు సాధకుడు బ్రహ్మచారియైనచో సృష్టిన్యాసమే చేయవలయును. గృహస్థుడైనచో స్థితిన్యాసము చేయవలయును. యతి యైనచో సంహారన్యాసము చేయవలయును. వారివారి ఆశ్రమములకు తగినట్లు న్యాసములను చేయుపద్ధతిగూడ అనుబంధము - 1లో చూపుట జరిగినది. ఆశ్రమమేది అయిననూ గూడ 'స్థితిన్యాసము' అన్ని ఆశ్రమస్థులును చేయవచ్చును' అని పాద్మసంహిత నిర్ణయించుటచే ఈ ప్రయోగ గ్రంథమున స్థితిన్యాసము చూపబడినది. గమనింతురు గాక!

13. మరొక ముఖ్యమైన అంశము పంచపాత్రనివేశనము. ఇది ఆచారములో స్వస్తిక ఆకృతిలో ఉంచుట నాలుగు మూలలయందు అర్ఘ్యాది పాత్రములుంచి మధ్యశుద్ధోదక పాత్రనుంచుట ఇత్యాది అనేక రకములుగా ఉన్నది. ప్రస్తుత సిద్ధాంతముననుసరించి.

'పాద్యంమధ్యే దక్షిణేఽర్ఘ్యం వామే చాచమనీయకమ్ ।
తస్య పార్శ్వస్య పార్శ్వేతు వామే స్నానీయపాత్రకమ్॥'

అనెడి పాద్మ ప్రథమ పక్షమేగైకొని ప్రయోగములో చూపుట జరిగినది. పాద్మ సంహితయందు చూపబడిన ప్రథమ పక్షశ్లోకము గతంలో అన్వయించక బహుశః ఇతర పక్షములు స్వీకరింపబడి ఉండవచ్చు. ప్రథమ పక్షమునకు అవాంతరములు ఏవైన ఏర్పడిన మాత్రమే ఇతర పక్షము స్వీకరించుట ఉచితమే తప్ప లేనిచో దోషమగును అందుచే ఈ ప్రయోగమున అన్వయక్లేశము కలగకుండుటకై పంచపాత్రనివేశనము చిత్రరూపముగా కూడ చూపబడినది.

14. నిత్యారాధన - బాహ్యారాధన నుండి శయనోత్సవము వరకు ఆరు - భాగములుగ విభజించబడినది. వీనిని షడాసనములు అందురు. అవి క్రమముగా మంత్రాసన, స్నానాసన, అలంకారాసన, భోజ్యాసన, యాత్రాసన, శయ్యాసనములు. ఇవి ఆరున్నూ ఈ ప్రయోగములో సంఖ్యాక్రమముగా నిరూపింపబడినవి. ఇందు మొదటిదగు మంత్రాసనమున ముందుగ ధృవమూర్తి యొక్క యోగపీఠమునకు అన్ని దిక్కులయందుకల పరివార దేవతలను ముందుగా ధ్యానించవలయును. వారిని చతురుపచారములతో అర్చించవలయును. ఆపై పీఠమునందధిష్ఠించి యున్న భగవానుని ప్రార్థించి సుముఖుని గావించుకొనవలయును. ధృవబింబము నకు సాలగ్రామమూర్తికి ఆరాధన అర్పించినపుడు ఆవాహన ఉపచారము అవసరములేదు. వీనియందు భగవంతుడు సదా వేంచేసియుండును. మిగిలిన బేరములయందు ఆయా కాలములయందు ఆయా ఉపచారములను గైకొను నిమిత్తమే ఆవాహన చేయబడి తిరిగి ధృవమూర్తిలోనికే పంపబడును. ధృవమూర్తిలోనికట్లు మరియొకచోటునుండి ఆవాహన ఉండదు. 2) ధృవమూర్తినుండి కర్మార్చయందు భగవంతుని ఆవాహన చేసి మంత్ర షడంగన్యాసపూర్వకముగా కర్చార్చయందు వేంచేపుచేయవలయును. ధృవబేరమునకు, కర్మార్చాబేరమునకు క్రమముగా అర్ఘ్యపాద్యాచమనాలనర్పించి, మధుపర్క నివేదనము గావించవలయును. 3) భగవంతుని యొక్క ఆంతరంగిక పరివారమగు శ్రీవత్సాదులను, వ్యాఘ్యాదులను, శంఖాదులను ఇంద్రాదిపాలకులను గరుడ విష్వక్సేనాదులను చతురుపచారములతో నియమిత స్థానములలో కర్మార్చయందు అర్చించవలయును అనెడి పాద్మసంహితయందు తెలుపబడిన మంత్రాసన క్రమము కొన్ని ప్రయోగములలో పరివారార్చన క్రమములో ముందు

వెనుకలుగ మరియొక రకముగా ఆచరణలో ఉన్ననూ క్రమమిట్టిదే అగుటచే ఆ పద్ధతే ఈ ప్రయోగమున చూపబడినది.

15. యోగపీఠ పరివార దేవతామంత్రములు బీజాక్షరములతో పాద్మసంహిత యందున్న మంత్రోద్ధార ప్రక్రియయందు నిర్ణయింపబడి ఈ ప్రయోగము నందు చూపబడినవి. ఇతర ప్రయోగములలో ఈ మంత్రోద్ధారమునందు కూడ దోష బాహుళ్యము కానవచ్చుచున్నవి. ఆ మంత్రములను ఇందు జాగ్రత్తగా గమనించ వచ్చును.

16. కర్మార్చయందు చేయు మంత్రన్యాసము కూడ 3 రకములుగా ఉన్నది. **స్థితే దేవే స్థితిన్యాసః ..................'** ఇత్యాది ప్రమాణమును బట్టి భగవంతుడు నిలచిన మూర్తియైనపుడు స్థితిన్యాసము కూర్చుని యున్నపుడు సృష్టిన్యాసము శయనమూర్తియైనచో సంహారన్యాసమును సాధకుడు ఏ ఆశ్రమస్థుడైననూ చేయవలయును. ఏ ఆకృతిలో ఉన్న మూర్తికైనను స్థితిన్యాసము చేయదగును. గాన ప్రయోగమున స్థితిన్యాసమీయబడినది. ఆరాధన సమర్పించునపుడు ఒక్కొక్క ఉపచారమునకు, ఆ ఉపచారము స్వీకరించుట కనుకూలమగు స్థితిలో, భగవానుడు వేంచేసి ఉన్నట్లు భావించ వలయును.

**'అర్ఘ్య వస్త్రాంబరాకల్ప పుష్పగంధానులేపనైః।**
**ప్రత్యర్పితం స్థితం ధ్యాయేత్ పాద్యాచమనయోః పునః॥**
**ఆసీనం స్నాన కాలే చ పద్మాసన సుఖాసనే।**
**నైవేద్య ధూప దీపాదా వాసీనం స్వస్తికాసనే॥**
**ఉపచారేషు చాన్యేషు తత్తత్కర్మా నుసారతః"** -- అందుచే

ఇచ్చట మంత్రన్యాసము చేయునపుడు భగవానుడు నిలచియున్నట్లు భావించ వలయును. విగ్రహము కూర్చుని ఉన్ననూ ఆ సమయమున నిలచియున్నట్లే భావించవలయును. అందుచే యిచ్చట స్థితిన్యాసమీయబడినది.

17. కర్మార్చయందు న్యాసమైన తరువాత, పరివారార్చనకుముందు ధృవబేరమునకు కర్మార్చామూర్తికి క్రమముగా అర్ఘ్య, పాద్య ఆచమనీయములు అర్పించవలయునని ఉన్నది. అచట ఏ మంత్రములతో అనునది సంహిత యందు ఈయబడలేదు. స్నానాసనమందు వేంచేసియున్న భగవంతునకు మరల అర్ఘ్యపాద్యాచమనీయములను అర్పించవలయునని సంహితయందున్నది. ఇచ్చట

**'సావిత్రీ'** మంత్రముతో అర్ఘ్యము. **'త్రీణిపదా'** అను మంత్రముతో పాద్యమును **'అపః పునంతు'** అనుమంత్రముతో ఆచమనీయములను అర్పించవలయునని మంత్రముతోబాటు చూపబడినది. ఇట్లే ఎచ్చటెచ్చట అర్ఘ్యపాద్యాదులు సమర్పించవలయుననియున్నచో అచ్చటల్లా మంత్రములు గూడ చూపబడి యున్నవి. కాని మొదటిసారి అర్ఘ్యాదులు అర్పించమనునపుడు మాత్రము (పరివారార్చనకు ముందు) మంత్రములేవియు ఈయబడలేదు. **'ఇతి విజ్ఞాప్య దేవేశం యజే దర్ఘ్యాదిభిః క్రమాత్'** అనే ఉన్నది. వానిని స్వీకరించుచున్నట్లు భావించమని యున్నది. ఒకే ఉపచారమును అనేక చోట్ల తెలిపినపుడు అది సమంత్రకమైనపుడు మొదటి ఉపచారమునందే మంత్రము తెలుపబడిన యెడల రెండు మూడు స్థానాదులలో మంత్రము సూచింపకున్ననూ ఈ ఉపచారము ఈ మంత్రముతో అని మొదటనే నిర్ణయింపబడినది కనుక ఆ మిగిలిన స్థానములలో ఆ మంత్రముతోనే ఉపచారము చేయవలెను. మొదటి స్థానమున మంత్రము సూచింపబడక మధ్య ఎచటనో మంత్రము సూచించినచో ఆ సూచించిన స్థానమునుండి మాత్రమే ఆ ఉపచారమునకు ఆ మంత్రము వినియోగించుట న్యాయము. దానికి ముందు ఉండు అదే ఉపచారమునకు ఆ మంత్రము వినియోగింపవలెననెడి నియమము వర్తించకపోవచ్చును.

అదే లోకన్యాయమిచ్చట గ్రహించినచో అర్ఘ్యాదులు మొదటిసారి అర్పించవలయుననినపుడు మంత్రమేదియు తెలుపక రెండవసారి నుండి మంత్రము తెలుపుటచే మొదటిసారి అమంత్రక అర్ఘ్యాది ఉపచారములు అర్పించవలయునని అభిప్రాయము కలుగుచున్నది. మా సదస్సునందు ఈ విషయమై సుదీర్ఘచర్చలు జరిపినప్పటికిని పండితులెవ్వరును ఒక నిర్ణయమునకు రాలేదు. పై లోకన్యాయమును అందరూ అంగీకరించిననూ భగవంతునకర్పించెడి ఏ ఉపచారముగూడ అమంత్రకమై యుండరాదనియు అయిననూ మొదటిసారి అర్పించు అర్ఘ్యపాద్యాదులవద్ద సంహితయందు ఏల మంత్రమీయబడలేదు. అనెడి విషయములోను సందిగ్ధముగానే వదలిరి. అందుకే మేము ప్రయోగమునందు సంహితలో నున్నట్లే అమంత్రకముగానే చూపితిమి. అయితే ఏ ఉపచారమునైనను మంత్రము తెలిసిననూ తెలియకున్నను మూలమంత్రముతో అర్పించుట దోషములేదు కనుక ఈ స్థానమందలి అర్ఘ్యపాద్యాదులను కూడ మూలమంత్రముతో

అర్పించిననూ దోషము లేదు. అయితే ఇతర మంత్రములతో అర్ఘ్యాది సమర్పణము ఆగమ విహితముకాదు.

18. స్నానాసనమునందు అలంకార స్నపనము దేవతావాహనముతో విశేష ఉత్సవాలలో జరుపుటకు తగిన రీతిలో అనుబంధము 5లో సూచించబడినది.

19. అలంకారాసనమందు స్నానానంతరము ఆభరణాద్యలంకరణమైన తరువాత 31వ పేజీలో ఊర్ధ్వపుండ్రధారణ కూడ చూపబడినది. ఇది సంహిత యందు లలేదు. అయిననూ భగవద్ధ్యాన శ్లోకములలో **'కృతోర్ధ్వ పుండ్రతిలకై ర్మండితమ్...'** ఇత్యాదిగా ఊర్ధ్వపుండ్రధారణ కూడ చూపబడినది. అందుచేత అలంకారాసనమునందు ఊర్ధ్వపుండ్రధారణ కూడ ఉండి తీరవలయును. దక్షిణ దేశాచారమునందు **'నతేవిష్ణో.... '** అను మంత్రముతో ఊర్ధ్వపుండ్రధారణ గలదు. అదే ఇచ్చట ప్రయోగములో చూపబడినది.

20. భోజ్యాసనమునకు భగవానుడు బయల్దేరుటకు ముందు **'గో గ్రాసం దేశికాయైవ దద్యాత్ దేవస్యసన్నిధౌ'** అని సాధకునకు మాత్రాదానమర్పించుట ఒక ప్రక్రియ. భగవానుడు తన భక్తులకువలయు సౌకర్యములు చేసిన పిదప తను సౌఖ్యములను పొందజూచుట చరిత్ర ప్రసిద్ధము. ఆ కారణముచేతనే తను భోజ్యాసనమునకు వెడలుటకు ముందు ఇంతవరకు తనను ఆరాధించిన ఆచార్యునకు కృతజ్ఞతతో ఆరాధకుడు గృహపోషణ నిమిత్తమై వ్యగ్రచిత్తుడుకాని రీతిలో మాత్రాదానమునందు సూచింపబడిన వస్తువులను సమర్పించును. అనగా పరిచారక ముఖేనగాని, యజమాని ముఖేనగాని సమర్పించుచున్నమాట. దీనివలన అర్చకుడు భగవదారాధనయందే శ్రద్ధ పెంచుకొని కుటుంబ భారము లేకుండా ఆలయ అభివృద్ధికి పాటుబడునని భావము.

ఈ రోజులలో జీతమునకో, వంతులుగానో, భూమిని పొందియో అర్చకులు చేయుచుండు ఆరాధనకు ఈ నియమము వర్తించకపోవచ్చు. అయిననూ చేయవలసిన రీతిమాత్రము అది. అవకాశము లేనిచో దీనిని నామమాత్రముగానైనా ఆచరించుట మంచిది.

21. ఇంతవరకు తెరతీయకనే ఆరాధన జరుపవలయును. మంగళ ధ్వనులతో తెరతొలగించిన పిదప వేదవేదాంగములను భగవంతునకు వినిపించవలయును. దీనినే **'శంగోలము'** అనియు అందురు. దేవాలయము నందు

ఆయా వేదవేదాంగముల పారాయణలకై ప్రత్యేక పండితులు నియమింపబడి ఉండవలయును. వారందరును ఆ సమయమునకు అచ్చట ఉండి తులసి పుష్పాదులు చేత ధరించి, ఆనాడు తాము చేయు పారాయణల ఆదిమంత్రమునో, శ్లోకమునో, పాశురమునో విజ్ఞాపన చేయవలయును. ఆపై తమ పారాయణలను కొనసాగించవలెను. వారొసంగిన తులసి పుష్పాదులు గ్రహించి భగవంతుని అర్చన కావించవలయును. అది అష్టోత్తర శతనామములు కావచ్చును, సమయము ననుసరించి సహస్రనామములును కావచ్చును. ఇచ్చట ఎవరి గోత్రనామములుగానీ అవసరములేదు. యజమానులుగాని, ధనము చెల్లించి ఆర్జితముగా శతనామ, సహస్రనామపూజలుకాని ఇతర ఉత్సవములుగాని బలిహరణమయి నిత్యోత్సవమై తీర్థప్రసాద వినియోగమైన పిదప మాత్రమే చేయవలయును తప్ప ఈ లోపులో చేయరాదు. ఈ తీర్థప్రసాద వినియోగము వరకు జరుగు కలాపమునకు 'నిత్యవిధి' అని పేరు. విశేషములను ఏవి ఆచరించవలసి వచ్చిననూ అది యజమానుల కొరకైననూ దర్శనార్థులకొరకైననూ సరియే. నిత్యవిధి పూర్తయిన పిదప మాత్రమే చేయవలయును తప్ప నిత్యవిధిలో మార్పులు చేయుటగాని లేదా మానివేయుట గాని ఎన్నడునూ చేయరాదు. ఈ రోజులలో నూతనముగ నిర్మించి ప్రతిష్ఠించు ఆలయములకు యాజమాన్యము వహించు పెద్దలు ఈ నియమమును జాగ్రత్తగా గమనించవలయును. పుష్పపూజ పూర్తికాగానే దివ్యప్రబంధాను సంధానము అధ్యాపకులతో చేయించవలయును.

శ్రియఃపతియగు శ్రీమన్నారాయణునకు మిక్కిలి ప్రీతిపాత్రమగు దివ్య ప్రబంధము ఏఏ ఆలయములందు అనుసంధింపబడునో ఆ ఆలయములందు భగవంతుడు ఆనందముతో వేంచేసియుండును. అచట దివ్యసూరులగు ఆళ్వారులును ఉందురు. అట్టి ఆలయములనే దివ్యస్థలములందురు. ఉదయము సమయాన తిరుప్పల్లాండు, తిరుప్పళ్ళియెழுచ్చి, తిరుప్పావై అనెడి ప్రబంధ పారాయణను 'సేవాకాలము' అని వ్యవహరించుటకు తిరుప్పావై ప్రబంధమునందలి చివరి రెండు పాశురములను నిలిపి మంగళాశాసనమైన పిదప తీర్థ వినియోగమునకు ముందు అనుసంధించవలయును. దీనినే 'శాత్తుముఱై' అందురు. విష్ణ్వాలయము అన్నిటియందును ఈ క్రమముననుసరించదగినది. ఒక వేళ ఆయా వేద వేదాంగముల ఆరంభమును అనుసంధించుటకు తగిన రీతిలో వేదవేదాంగముల ఆరంభమును. 2వ అనుబంధమునందు చూపుట జరిగినది.

ఆ క్రమమును అర్చకులు గమనించి అట్లయిననూ చేసుకొనవచ్చును.

ఈ ప్రబంధ సేవాకాలము కూడ క్రమబద్ధము చేయుటకు కేసెట్ రూపమున వెలవరించినాము.

22. విష్ణ్వాలయములందు ఆళ్వారుల ప్రతిష్ఠ, ప్రబంధ పారాయణలను గూర్చి ఈ మధ్య బయల్దేరిన కొన్ని ఆక్షేపణలకు సమాధానముగా ఆగమ పురాణ ప్రమాణములతో **'వితండముండనము'** అనెడి గ్రంథము శ్రీవాసుదాసాశ్రమం నడిగడ్డపాలెము నందు ప్రచురించబడియున్నది. అవసరముగలవారు దానిని గమనించవచ్చును. ఆలయమున ఆళ్వార్ల ప్రతిష్ఠ దివ్య ప్రబంధ పారాయణలు మాత్రము అవశ్యానుసంధేయములని గమనించవలయును.

23. భోజ్యాసనము నివేదన (ఆరగింపు) సమర్పించునపుడు 'ఓం ప్రాణాయ స్వాహా' ఇత్యాది మంత్రములతో మనుష్యులకు వలెనే సమర్పించుచున్నారు గాని అట్లు చేయరాదు. **'దేవస్యత్వా...... '** అను మంత్రముతోనే ఆహుతులను సమంర్పించవలయుననెడిది నియమము. అదే ఈ ప్రయోగమున వివరింప బడినది.

24. పక్వాపక్వ పదార్థములను నివేదనకు చేర్చిన తరువాత కవచ మంత్రముతో పరిషేచనము చేసి పదార్థములకు, **'దాహనప్లావనాది'** సంస్కారములు చేయవలయునని సంహితయందున్నది. ఏ పదార్థమైననూ భగవానునికి అర్పించుటకు పూర్వము ఆ వస్తువును శోషణముద్రతో ఎండింపజేసి దాహనముద్రతో దహింపజేసి ప్లావనముద్రతోతడిపి భగవన్నివేదనకు అర్హతను పొందినట్లుగ భావించవలయును. శోషణ, దాహన, ప్లావన మనెడిది ఒక పౌర్వాపర్యక్రమము: అన్ని స్థానములందు అట్లే యున్నది. హవిర్నివేదన స్థానమందు పాద్మసంహితలో ఈ క్రమమును మార్చుచు **'దాహనప్లావనాదికే... చర్యాపాదం 3-174 శ్లో॥'** అనెడి శ్లోకములో చెప్పబడినది. ఆ శ్లోకపు అభిప్రాయప్రకారము ముందుగా దాహనము తదుపరి ప్లావనము **'ఆది'** శబ్దముచే శోషణము గ్రహింపవలయునని తోచుచున్నది. అనగా ముందుండవలసిన శోషణము చివరకు చేరినది. మా సదస్సులో ఈ విషయమే చర్చించునపుడు శోషణము ముందే ఉండవలయును కాని క్రమము మార్చరాదని కొందరు పండితులు వాదించిరి. అట్లుండవలెనన్నచో సంహితా శ్లోకమునందు **'శోషణప్లావనాదికే'** అనియే చెప్పియుండవచ్చును. దానివలన ఛందో భంగమేమియును రాదుకద! అయిననూ **'దాహనప్లావనాదికే'** అని

ఆరంభించుటచేత దాహనమే ముందుండవలయునని సంహితాకారుని అభిప్రాయమని స్పష్టమగుచున్నది. అని కొందరు నిరూపించిరి. అదియునుకాక నివేదనముచేయు పదార్థములు మొదటి క్రమము ననుసరించియే శోషణ దాహన ప్లావనములు కావించినచో చివరిది ప్లావనము (తడుపుట) కనుక పదార్థములన్నియు తడిపి ముద్దగా నుండునేమో! భావనాస్ఫూర్తితో చేయునదేకదా నివేదనకూడా ఆ భావనలో తడిపి ముద్దయైనట్లు పదార్థములను భావించిన తదుపరి అమృతీకరణము జరిపిననూ భగవానుడు స్వీకరించుటకు ఇబ్బందియగునేమో అనిపించుచున్నది.

చివరి శోషణమున్నచో అట్టి ఇబ్బందిలేక పదార్థములయందలి ప్లావనమువల్ల ఏర్పడిన తడి ఆరియుండునుగాన ఆపై జరుపు సురభిముద్ర ప్రదర్శనమువల్ల ఈ పదార్థములు అమృతీకరింపబడును గాన భోగ్యముగా స్వీకారయోగ్యములు అగును అని అనిపించుచున్నదని యుక్తితో గూడ సమర్థించిరి అయిననూ మొదటి వర్గము వారు దీనితో తృప్తిబడలేదు. ఇట్లు ఈ క్రమము మారుట ఎచటనూ లేదని వాదించబోయిరి. దానికి 'రెండవ వర్గమువారు పంచపాత్రాసాదనమున ద్రవ్యశుద్ధి జరుపునపుడు శోషణము లేకనే దాహన ప్లావనములు మాత్రమే చూపబడి ఉండుటను ప్రమాణముగా చూపిరి' దానికి మొదటి వర్గమువారు అట్లయిన ఇచ్చటనూ దాహన ప్లావనములే చాలునేమో అనిరి. సంహితా శ్లోకమున '**దాహన ప్లావన**' అని తెలిపి ఆపై '**ఆది**' పదముకూడ చేర్చుట జరిగినది అనగా ఆ రెండింటితోబాటు మరొకటి కూడ ఉండవలయును కదా అది శోషణము తప్ప వేరొకటి కారాదు. పంచపాత్రల వద్ద ప్రకరణానుసారము దాహన, ప్లావనములు మాత్రము ఇచట భోజ్యాసన ప్రకరణమునకు దాహన ప్లావన శోషణములే క్రమము. మిగిలిన చోట్ల శోషణ దాహన ప్లావనములే క్రమము. పంచపాత్రలవద్ద ఈ క్రమభంగమును అంగీకరించినపుడు సంహిత శ్లోకము ప్రమాణముగా నున్నపుడు ఇచ్చట మాత్రము ఆ క్రమభంగము నంగీకరించుటలో దోషమేమియులేదు కనుక శోషణమే చివర ఉండదగును అని రెండవ వర్గము వారు సమర్థించిరి.

మొదటి వర్గమువారున్నూ ఈ సమర్థనను కాదనలేక అంగీకరించిరి. కాని సంహిత చెప్పిననూ అది యుక్తియుక్తమే అయిననూ కూడ తెలిసియున్నంత వరకు అందరును పాటించు శోషణ దాహన ప్లావనక్రమమును మార్చుటకు సుముఖతను

